జీవులను తరింపజేయుటకు పీఠాధిపతులు కావలెనా? అయినచో మీరందరు ఎట్టి పీఠాధిపత్యము రానప్పుడే వచ్చిరి. నేను ఎన్నిసార్లు చెప్పియున్నాను, జ్ఞాపకము లేదా? నేను ఆశ్రమము పుచ్చుకొనక పూర్వము వచ్చినవారే నిజముగా ముముక్షువులు అని!

ఇది యేదో పదవి అని నేను కుతూహలపడి మారినాను అని నీవుగాని, ఇతరులుగాని అనుకొనుట, ఆయనకు బాగా జరుగుచున్నది. ఆ శిష్యులు, ఆ రామకృష్ణరావు మొదలైన వారు వున్నారుకదా! ఆ రామకృష్ణరావు ఉండగా ఆయనకేమి అని ఇతరులు నాయందు ఏ మార్పునో కాంచినట్లనుకొనునట్టిది కాదా? నాయందెట్టి మార్పులేదు. ఉండదు అని ఈశ్వరియే మీకు ఋజువు చేయగలదు. ఈ వాక్యము ఎప్పుడు మరవకుండా మనవాండ్రందరకు— పురుషోత్తమశాస్త్రి, నరసింహము మొదలగువారలకు చెప్పవలయును.

ఇక నేమి వ్రాయను? రామకృష్ణాదుల క్షేమము వ్రాయుము. ఇది నా కడపటి మార్పు అని అనుకొనుచున్నావు. కాని ఇంక ఎన్ని మార్పులు రాగలవో దేవున కెఱుక! నాకును ఎఱుకయే. సర్వ మనిత్యము ధ్రువమని తెలిసిన ప్రతివానికిని ఎఱుకయే. మీ నాన్నగారి క్షేమము వ్రాయుము.

మొట్టమొదట నేను ఆశ్రమము తీసుకొనబోవునప్పుడు నీవు కూడా ఆశ్రమము తీసికొందునని చెప్పినప్పుడు నేను: "ఇద్దరు తీసికొనిన బూడిదరాలును. ఒకరు గృహస్థు[illegible] సంపాదించుచుండవలయును, ఒకరు సన్యసించిన" అని చెప్పినది ఇప్పటికిని నా స్థితి[illegible]ట్లే ఉ[illegible]ది. ఇది నీకు విశదముగా చెప్పినాను. మొన్న నీ విక్కడ యున్నప్పుడు నీవు స[illegible]న [illegible]ప్పుడు మానగలవో నేను చెప్పెదననియు, అందాక నా తరఫున నీవు పని చేయుచు, చిన్నవాళ్ల క్షేమము చూచుచు, ఉత్సాహముతో, వచ్చుచు పోవుచు నుండవలయు ననియు చెప్పితిని. తర్వాత ఇద్దర[illegible] కలసి యిక్కడనే ఉందుమో చూచుకొందము అని తిరిగి చెప్పుచున్నాను. ఇప్పుడు వచ్చిన మార్పేమి? కొంచెము దూరమన్న మాట తప్ప సంవత్సరమునకు 40 రూ. మనవి కావు అనుకుంటే ఊడిపడవచ్చునే యిక్కడికి. తర్వాత నేను యిక్కడ ఉండుటే నిశ్చయమైనను ఎప్పుడు పడితే అప్పుడు నేను రాగలనే! అట్టి స్వతంత్రము నాకు లేనిచో విష్ణు చెప్పినట్లు, imprisonment ఇది.

నా ప్రకృతి నీవెఱుగవా?

కావున హాయిగా నుండి నేను నీ యా గదిలో నున్నప్పుడు ఎట్లా office కు వెళ్లుట, court కు వెళ్లుట జరుగుచున్నదో అట్లే జరుగవలయును. కొంచె మీ గది దూరము. ఇంత యేల, నా భావ మిప్పటికి ఏమీ మారలేదు. అందుకనే రాజును ఆశ్రమము సంపూర్తి చేయమని చెప్పితిమిగదా!

ఇవియే నారాయణ స్మృతులు

విమలానంద భారతీస్వామి